మ. తనచెక్కిళ్ళను జక్రిచక్రనభగం దత్పుత్రు వాలిన్ హరిన్
వను, నీయొద్దను విద్దెబుద్ధిఁ గొనుటం ద్వత్పుత్రుసుగ్రీవుఁ బెం
పనుదోడైన మరుత్సుతుం డనుచిన్, భావింపుదున్ స్వగణముం
దునసహ్యంపడునన్నుఁ బ్రేమఁగనఁ జే? దూరీకృతారీ! హరీ!!. 38

ఉ. నిత్యము సత్ప్రతాపమున, నీవలెనీకడనున్న శూరులై
సత్యముగా హిమాద్రితనుజాతసుశక్తిగఁ బూర్ణగాఢసాం
గత్యముచేతఁ జేసెను శిఖాముఖరుద్రములటన్న నీయధి
ప్రత్యధిదేవతల్ తరణి! పాపుతమామక జాడ్యజాలముల్. 39

మ. అరుణుండుద్భవమందఁ బ్రాణుల శరీరాంతస్థ దుర్వాయువుల్
దరమై బైటికివచ్చు; నవ్వుడును నిద్రం బొందినన్ నీదు భీ
కరతన్ లోనికిపోయి యభ్యుదితుకోగం జెచ్చుగానిచ్చు నా
నరణింబోయెడి వేళ నాకొసఁగవే! సౌఖ్యంబు సూర్యప్రభూ. 40

మ. అభినిర్ముక్తతయందు నభ్యుదిత కార్యంబందు నప్రాజ్ఞతా
త్యభిమానాబలతాదిదుర్గుణము లత్యంతాశ నెత్తెక్కుటన్
శుభదార్ఢ్యంబు నిరోగముంగనుటకున్, శుద్ధుండఁ గాకుంట ఘో
రభయభ్రాంతిఁ జింతనొందునను సంరక్షింపుమా! మిత్రుఁడా. 41

శా. నాపూర్వార్జిత పాపకర్మగతినో నానాల్పభావక్రియా
రూపంబైన కవిస్వభావముననో క్రూరస్వభావుండనై
యేపుణ్యక్రియయైనఁ జేయుటకు నొక్కింతైన శ్రద్ధంగొనన్
నీపేరన్ వచియించుచుంగొలిచెదన్, నన్ గావుమా! మిత్రుఁడా. 42

క. నీవారమునిసికుధరధు, నీవారము నీరమునఁగొను నిష్ఠకుఁ దృప్తిన్
నీవారము శ్రీవశమగు, నీవారము నాఁగసుఖము నిల్పవె ? మిత్రా. 43

క. కరమనుజతనిశముదివా, కర! పరతిమిరనికరదరకర! సరససుఖా
త్కరకరకర! వరకరుణా, కర! యనివారకరతికరకరపుటమిదిగో. 44

చ. ఎదురెటుగన్నలేక చనునేఁ బదితొమ్మిదివేల యేఁబదె
న్మిదిదశలంగ్రహాళి గమింపుచునుద్భవ కాలరాసులం
దెదిగను, జెవ్వరింగలసి, యేఫలకారత, నేయవస్థ, నే
పదమునున్న, గోచరభవత్స్థితి భద్రమెయిన్మ భాస్కరా. 45

సీ. ఆరోగ్య, యజ్ఞ, రాజ్య, సుఖ, బలాదులు, కనకాశ్వవాహన గమనసిద్ధి
సింహాసనస్థితి, శ్రీపద్మరాగముల్, తామ్రలోహము, తృణధాన్యరాశి,
రక్తశాలువులును, రంజిల్లుఛత్రిముల్ శౌర్యంబు, నావధసంగ్రహమ్ము
నగ్నిజయస్తంభనాది విభావముల్ నేత్రవైద్యత ముక్తినియతబుద్ధి
గీ. నీవొసంగుఫలములెగాన నిత్యముంగ, గాత్రమున్నంతవఱకు నతకరుణనిచ్చి
వ్యాధిమృత్యుజరాభవ వ్యథలు లేని, ముక్తినిమ్మటుపైనసత్పూజ్యమిత్ర, 46
మ. మతిలేకేవియెు కోరుచుందునవియీ మై యొందుపర్యంత మే
పితవానీవరుదెంచి నేఁ ములకుంబీడింతు వంచులుర్నన్
గతభీనాడుకొనంగ నీవెపుడుగానన్ రానిచోటైన శా
శ్వతమోక్షస్థితి నుంచుమీ భవముపైఁ బాపాపహారీ; హరీ! 47
సీ. తనపేరమానీవుఁ దగనేలికీమ్మిరుఁ డానిఁ బితృసమానుఁడయ్యె మాకు
నతనినెచ్చెలిచుట్టము హిడింబుఁడుగూడ నతనితోనె సమానుఁడయ్యెమాకు
నతనిచెల్లెలిమగండనిలోనబలుమగండైన భీముఁడు మామయయ్యెమాకు
నతనిమామకుమారుఁ డఖిలజగత్పితయైన కృష్ణుఁడుఁ దండ్రియయ్యెమాకు
గీ. నతనికుడికన్నుగానీవె యమరియుండ, నీకటాక్షము మాయందు నిల్పుమంచు
వేఁడవలెనే? సుతులఁ బ్రేమఁజూడకున్నఁ, దండ్రికపకీర్తిరాదటే? తరణిదేవ.
ఉ. శ్రీయుతముత్యవెంకయకు రెండవపుత్రుఁడు, ముత్యసూర్యనా
రాయణమూర్తి, సీతనగరాబుధదత్తకుమారుఁడాదినా
రాయణమూర్తిసేవన వరాయణ కీర్లమపూఁడివాసి, పా
రాయణబుద్ధిలోకమువురాయనఁ జేసెనిటుల్ రవిస్తుతిన్. 49
క. దీనినఁ జదివిన వ్రాసినఁ, బూనికఁ జదివించివిన్నఁ బూజించినదే
హానూనమనోబలములఁ, బూని సుఖముగాంతురు జనములుమిత్రదయన్. 50

శ్రీ.

# చంద్రస్తవము.

శా. శ్రీమద్భాస్కర మండలానలదిశా శ్రీచంద్రమోమండలో
ద్దామత్రివృత్చతురశ్రి పీఠమునఁ బ్రత్యగ్దిఙ్ముఖాసీనుఁడై
హేమాభాంగద వజ్రకుండల కిరీటేద్ధాంగుఁడై సద్గదా
శ్రీమత్పాణి దశాశ్వదివ్యరథుఁడౌ శీతాంశు భావించెదన్. 1

క. శ్వేతాంబరు, శ్వేతాశ్వుని, శ్వేతధ్వజచామరాద్యు శ్వేతచ్ఛత్రున్
శ్వేతస్రక్చందనధరు, శ్వేతాంశుని, శీతశీలు శ్రీమతిఁదలఁతున్. 2
క. తనతేజున రవిజగములు, జనియింపఁజేయుఁదనదు చల్లనిబలుతే
జునజైవాతృకతనిడుచు, మనఁజేసెడునమృతమూర్తి మదిభావింతున్. 3
మ. వరమోంకారమనోబ్ధిఁబుట్టి జగముల్ పాలింపఖేచారుఁడై
సరసాత్రేయసగోత్రజాతుఁడయి వంశస్థాపనాచార్యుఁడై
వరదుగ్ధాబ్ధిజనించి యీశ్వరశిరోభాగాద్యలంకారుఁడై
స్థిరకీర్తిన్విలసిల్లు తెల్లదొరకుంజెల్లింతు సల్లాపముల్. 4
క. తనుకారకతఁగనుటం, దనుజవ్యాధులనడంప నతిఁజేసితి సూ
ర్యునికి; మనఃకారకునిను, మనోభవాధులనడంప మదిఁదలఁతుశశీ. 5
మ. ప్రజజన్మించినవేళఁ బూర్ణత మనోభావంబునందుండి యా
ప్రజకుంజిత్తబలంబుఁ బెంచుటఁ "బరబ్రహ్మంబు చిత్తంబులో
నజనించెన్ శశి" యందుశాస్త్రరిపులు న్మన్నింప జ్యోతిష్క్రమా
నిజనానందముఁగూర్చు బ్రాహ్మణవిభున్ నిన్నుందలంతున్ శశీ. 6
క. ఘనబుధులందఱు నీమే, నినుముక్రలు గాఁగఁజెక్కిరి నీరక్తము దా
వినవారికి మిత్రుఁడవై, తనరెడునీసౌమ్యమహిమఁ దలఁతున్ సోమా. 7
క. సురభుక్తనిజతనువిలా, సురులధ్వరములను మఱల నుగుచింబరఁగన్
విరచించుటఁ దద్భూసుర, వరదైవతమువయిన నినుభావింతుశశీ. 8
మ. కటకెంజీఁకటిలోనఁ దన్నునతలోకంబుల్ "పిశాచంపిదె
చ్చటి"దంచున్ నిశలందుఁగొల్వరని చర్చల్ సేయు శ్రీనిష్ఠతో
"నిటుచూవా! వగనొందుటేఁగలుగఁగానే" యంచుఁ బూర్ణప్రభా
పటలిన్ సర్వవిచారముల్ దొలఁచునిన్ భావింతుఁ జంద్రప్రభూ. 9
క. నినుజగముజ్జ్వలనటం, గనకజ్ఞుఁడు నీదుజన్యగారము దుగ్ధాం
బునిధియులమీఁద లేదని, యనఘపురాణములఁదూలనాడు సుధాంశా. 10
చ. ఘనకృశమై, సువృత్తమయి, గాఢకఫానిల మిశ్రతత్వమౌ
తనువును, మంజువాణియును, దట్టపుటూహలు పన్నుబుద్ధియుం
దనరశుభప్రదాక్షులను దాల్చిననిన్నురుదివ్యదృష్టిచేఁ
గనిమునులెల్లఁజెప్పనది కల్లను మూఢుఁడు సూత్ను భాంబుజా. 11

గీ. దక్షుశాపంబున భవత్క్షయాభి, వృద్ధులగునన్న; భూచ్ఛాయఁ జెరఁగితగ్గు
నీదుమండలస్థితినిట్లనిరని యొకఁడు "మునులుమూఢు"లను నిదేమిబుద్ధి? చంద్ర.

సీ. రవికాంతినోషధుల్ బ్రతికింపఁ; జల్లని నీకాంతిసారంబు నింతువందు
రవియగ్నిరౌధరా భవదోషముహరింపఁ, జల్లఁగాఘుటికల నల్పుదీవు
రవ్యుష్ణఘుటికగర్భముఁజేరఁ; జల్లనియనుపానమై నీవు నరుగుదటకు
రవియుష్ణవృద్ధిచే రఁజింపఁ; జల్లనిపథ్యంబులను నీవు బలముగూర్తు

గీ. వహవా! కోరనిబుధవైద్యులైనసూర్య; నిన్నునమ్మినరోగముల్ నీఱుగావె?
చావుచావదే? తెలియకజడుఁడుమూఢ, వైద్యులనునమ్ముఁ; శతభిషక్ప్రభుసుధాంశ

సీ. ఇట్టిపిల్లయటంద్రు మట్టిచెట్టందురు తొట్టిగుండెయటంద్రు తోఁచినట్లు
వీరభద్రునితన్ను వేఁడిమచ్చయటంద్రు తారకోరస్స్న కస్తూరియందుర
భర్గజటాచ్ఛటా పరిలింబముందురు నల్లచెవులపిల్లి పిల్లయందురు
కవులిట్టులనయంత్ర ఘనసాధములు భవన్మండలస్థాదిగణంబులంద్రు

గీ. బళిర! నీమచ్చబలుపిచ్చి తలఁపులిచ్చె, నమృతపూర్ణయుష్మన్మండలాంతరస్థ
రుచిరరోహిణకద్వీపరూపమనియె, జ్ఞాననేత్రవేదవ్యాసమౌని; చంద్ర. 14

మ. పరమక్షాంతిగురుండు నిన్నుశపియింపన్మాని నంగుండుటన్
గురుపత్నీకుచశాతశూలహతినీకుం గుండెపుండై నిజ
స్థిరదివ్యామృతశక్తిమానియును దుష్కీర్తింగడుం దొడ్డదై
పరఁగన్ మచ్చగనందురు; ప్రౌఢకవి నెవ్వాఁడౌపుఁ? దారాధిపా. 15

క. కవిగౌతమాదులవలెనె, సునచశ్నరుఁడయ్యెగురుఁడు "సోమఃప్రథమో
వివిదే" యను శ్రుతిఁగనిద్విజ, ధవు నిన్నుశపింపకుండెఁ దారాజారా. 16

సీ. గురుసతిందారేచ్ఛ గురునకర్పింపక, నతనితోబలుకయ్యె మాఘనీకు
బ్రహ్మదావచ్చిపూర్వమ్ము నీవుతనకు, నిచ్చినరోహిణినిచ్చిమఱల
"దీనినిందారాధికానూనరుచిఁగొను", మనినిజాంశజుని నిన్నునయించి
గురునకుఁ దారానుగుణ్య సౌఖ్యమునిచ్చి, యాబ్రహ్మతనయింటికరిగినంత

గీ. నెంతదారేచ్ఛతోదాని నేలుకొన్న, రోహిణీపతినామంబు రూఢిగాక
నీకుఁదారాధిపత్వాఖ్య నిల్చెఁజంద్ర!, యిలనుదారేశగురుమూర్తి వీనెకావె?

క. గురుఁడవయిన కారణమున, గురుతరశుభమొందఁగోరి గురుభక్తిని నా
గురుగతిని నుతింతును నలు, గురు పెద్దలతోవను బుధగురునినుఁజంద్రా. 18

మ. శివుఁడుగా త్రికష్టుఁ డురుదుఃఖదాతనికడన్ శ్రీశక్తితోఁ జేర్చి ని
ల్వ, వరాత్మా శ్రితకోటిఁ జల్లనిదయం బాలింపనౌనందు శీ
తవరాధీశుఁడు శ్రీవతంసమయి, నేత్రంబై, ముఖంబైతగన్
శివకన్నిన్ను నిజాంశుఁబన్నుపఱచెన్ శ్రీచంద్రలోకేశ్వరా. 19

క. ఘనముగ నిహపరసుఖములు, గనఁగ్రమముగ ధీమనములు కారణములుగా
వునఁ దత్కారకుఁడవగుట, ననిశంబునొసంగుమనఘమునవిచంద్రా. 20

ఉ. నిత్యము శీతలాత్మతను నీవలెనీకడనున్న తల్లులై
సత్యముగాజగత్సుతను శంకరతాపములెల్ల గాఢసాం
గత్యముచేతఁ బాపుశివగంగయుగౌరియు నన్నదీయధి
ప్రత్యధిదేవతల్ జలజ! పాపుత! మాయకతాపపాపముల్. 21

క. తాపత్రయరూపకసం, తాపముఁ బాపములుఁ బాపి తావనభూపుల్
రేపును మాపును నోపికఁ, జేపడఁజేసికొను నమృత సీమనిముశశీ.

మ. తతహాలాహలఘోరహేతివిషమంతర్బాహ్యలోకాళిసం
తతిఁ బ్రోవంగ శమం బిముడ్చుకొని తత్తాపాపహారార్థమై
నతతాచ్ఛామృతమూర్తి నిన్నుఁదలపై సంప్రీతితోఁ దాలిచెన్
శితికంఠుండు; మనుష్యతాపమునినన్ నీకోర్కలెకార్కా? శశీ. 23

చ. ఎదురెటుగన్న రేకచను నేఁబదిలొమ్మిదివేల యోఁబదె
న్మిద్రది దశలం గ్రహాళిగమనించుమదుద్భవ కాలరాసులం
దెదిగను, చెవ్వరింగలసి, యేఫలకారత, నేయవస్థ, నే
పదమునమున్న, గోచరభపత్నిసిరి భద్రమెయిమ్ము! చంద్రుఁడా. 24

క. శారదనీరదనారద, పారదహరదరహీర భాసురమూర్తీ
పారసభవ, సారసభవ, పారసభవనాభకీర్తినతతమునిమ్మా. 25

సీ. చిత్తప్రసాద, సుస్త్రీ, విత్త, గోక్షీర, జల, వస్త్ర, కృషి, సస్య, వత్ఫలములు
మణులు. శంఖములు, చామరములు, పాండురచ్ఛత్రముల్, సౌరభసారసములు
వీర్యపుష్టి, వినయ, వీద్రాభరోరుకేదారలాభమ్ము, దీప్తత్వగరిమ,
ఫలవర్గ, రసవర్గ, బహుభాగ్య భోగముల్, వంతతానందద సంపదలును
గీ. నీవొసఁగుఫలములెగాన నిత్యములుగ, గాత్రమున్నంతవఱకు సత్కరుణనిచ్చి
వ్యాధిమృత్యుజరాభవ, వ్యథలులేని, ముక్తినిమ్మటుపైన సత్పూజ్య! చంద్ర.

మ. తనువుల్ సార్థముఁ జేయ వాంఛగొనఁగం, దారాళి దాతాళిఁ జే
సినభాస్వద్విరుదమ్ము వాఁడవు నసుజ్ఞ శ్రేయోర్థ శ్రీయోర్థుఁ జే
సినఁ జేయంగలజాణవంచు నినువాంఛింప న్మాదల్గొంటినా
తనువున్ నీబిరుదమ్ము సార్థతను బొందం జేయుమా! చంద్రుఁడా. 27

సీ. ఏన్గురాపిడికోడి యేతెంచి వేఁడిన శశముఱొమ్మునఁ జేర్చి సాఁకినావు
విషతాపమును బాప విడిచి సంసారంబు శివశిరోవాసంబు సేసినావు
మృగశీర్షనెవరించి మేలనఁ దారాళి బుధవరులకు దారవోసినావు
బుధులయాఁకలిదీర్పఁ బూర్ణదేహముగోసి పెద్దతెగువఁ బంచిపెట్టినావు
గీ. జగములేలనిల్వఁగడలేక సంతతంబుఁ; దిరిగి శ్రమపడుచున్నావు దేనినీయ
వాశ్రితులకు! నానకలభావామలఫల మమృతపదవాసము నొసంగు మమృతమూర్తి

ఉ. శ్రీయుత ముత్యవెంకయకు రెండవపుత్రుఁడు, ముత్యసూర్యనా
రాయణమూర్తి, సీతనధరా బుధదత్తకుమారుఁడాదినా
రాయణమూర్తి సేవన పరాయణ కీర్తమపూఁడివాసి పా
రాయణబుద్ధి లోకమువురాయనఁ జేసెనిటుల్ శశిస్తుతిన్. 29

క. దీనినిఁ జదివిన వ్రాసినఁ, బూనికఁ జదివించివిన్నఁ బూజించిన దే
హానూన మనోబలములఁ, బూనిసుఖము గాంతురు జనములు చంద్రిదయన్. 30

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ.

# అంగారక స్తవము.

---

శా. శ్రీమద్వ్యాసనగర మండలాంతకదిశా శ్రీభూజమర్త్యమండలో
ద్దామంబైన త్రికోణపీఠమున నద్ధర్మాధిరాడ్దిఙ్ముఖుం
డై మణ్యంగదరత్నకుండలకిరీటాక్ష్మపరిభాభవ్యుఁడై
శ్రీమచ్ఛక్తిగదా త్రిశూలకరుఁడౌ శ్రీభౌము భావించెదన్.

క. రక్తపటు, రక్తధాముఁడు, రక్తచ్ఛత్రానురక్తు రక్తపతాకున్
రక్తస్రక్చందనధరు, రక్తతనుఁ దలఁతు సదానురక్తిఁ బోషిన్.

ఉ. కుండల మండలేశతఁ, గుకుండలజత్వము నంది యంబుర
ణ్మండలమండనాక్షిముఖమండితకుండలగండమండలా
ఖండలవైభవంబుల నఖండజవాజనువాజిభూజను
ర్మండలచారుఁడై తగు ఖమండలమండను భానుఁ గొల్చెదన్. 3

చ. జననిమహాక్షమాంగ, బుధసన్నుత సత్కరుణాకరుండు భూ
జనపరిరక్షణార్థ బహుజన్మధరుండగు మాధవుండు నీ
జనకుఁడు; నీవు భక్తఫల సంఘటనాత్ముఁడ విట్టిపుణ్యసం
జనను నినుం గుజన్ములు గుజన్ముఁడ వందు రెఱుంగ కోయనా. 4

చ. తనుతమమధ్యముల్ లసదుదారపుదానము నిత్యయావనం
బును, జపలస్వభావమును; బూరితపైత్యశరీరముల్ ధరిం
చిననిను దివ్యదృష్టిఁ గని చెప్పిన మౌనులఁ దిట్టి మండలం
బునె నినుఁ గాఁదలంచు నతిమూఢుఁడు; సూక్ష్మజగత్ప్రభూసుతా. 5

శా. శ్రీపుణ్యంబున భాగముం గొనియు సుశ్రీమాతృభూపేరిమనో
మాపుణ్యంబువనో సమీపమున ధామంబూని యున్నావు; భా
మా! పూజ్యా! సహజోరుభావనతులన్ మాకిచ్చి మమ్మేలుమీ
యాపాపంబులు లెక్కపెట్టకుము మాయన్నా! స్థిరాత్మోద్భవా. 6

శా. భారంబెల్ల నడంచి మమ్మును సదా పాలింపరావే! జగ
ద్భారోద్వాహక! నేరముల్ సయిఁపవే! ధన్యక్షమాత్మోద్భవా!
భారద్వాజసగోత్రజా! కులగతుల్ పాలింపవే! రాగశో
భారా! నన్ననురాగదృష్టిఁ గనవే! యగ్గింతు నిన్నెప్పుడున్. 7

చ. ఎదురెటుగన్న లేక చను నేఁబదితొమ్మిదివేల యోఁబదె
న్మిదిదశలం గ్రహాళి గమనించు మదుద్భవకాల రాసులం
దెదిగను, దెవ్వరింగలసి యేఫలకారత నేయవస్థ, నే
పదముననున్న, గోచరభవస్థితిభద్రమె యిమ్ము భాముఁడా. 8

ఉ. నిత్యము శాశ్వతోపకృతి నీవలె నీజననీసుబంధులై
సత్యముగా జగద్గణము సర్వఫలంబులనొందఁ జేసి మసాం
గత్యముతోడఁ జేయు మహికాంతయు, క్షేత్రపుఁడన్న నీయధి
ప్రత్యధిదేవతల్ కుజుఁడ! పావక! మామకజీవనవ్యథల్. 9

సీ. సాహస, ప్రహరణ సామర్థ్య, భుజబల, జయ, కలహవివాద జయబలములు
యువరాజభావంబు, నుర్వీజ, మాణిక్య, తామ్ర, ప్రవాళ, కాంతి, కనకములు,
పర్వతమరుదావ భాగనిర్గమనము, వ్యాఘ్రకీటకవిష భయహరణము
దండనీతియును, ముద్రాబంధ, సేనా, శతఘ్ని, సుదుర్గ, ప్రతాపములును
గీ. నీవొసంగుఫలములెగాననిత్యములుగ, గాత్రమున్నంతవఱకు సతతకరుణనిచ్చి
వ్యాధిమృత్యుజరాభవవ్యథలులేని, ముక్తినిమ్మటుపైన సత్పూజ్యధామ. 10
ఉ. శ్రీయుత ముత్యవెంకయకు రెండవపుత్రుఁడు ముత్యసూర్యనా
రాయణమూర్తి, సీతనధరాబుధ దత్తకుమారుఁ డాదినా
రాయణమూర్తిసేవన పరాయణకీర్తిమహుఁడై వాసి పా
రాయణబుద్ధి లోకమువురాయనఁ జేసెనిటుల్ కుజస్తుతిన్. 11
క. దీనినిఁ జదివిన వ్రాసినఁ, బూనికఁ జదివించి విన్నఁ బూజించినదే
హానూనమనోబలములఁ, బూనిసుఖముగాంతురు జనములు క్షామపయిన్. 12

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ.

# రాహుస్తవము.

శా. శ్రీమద్భాస్కర మండలాశరదిశా శ్రీమత్తమోమండలో
ద్దామశ్యామలశూర్పపీఠమున సద్ధ్యామ్యాన నాసీనుఁడై
హేమాభాంగద నీలకుండలకిరీటేద్ధాంగ నీలాభుఁడై
శ్రీమచ్చర్మగదాసిశూలకరుఁడౌ శ్రీరాహువుం గొల్చెదన్. 1
క. శూలము, గదఁ, జర్మముఁ గర, వాలముఁ దాలిచి కరాళవక్త్రము మెఱయన్
లీలను సింహమునెక్కి ప్రజ, గాలను బాలించు సింహికాసుతుఁ గొల్తున్. 2
క. నీలపటు, నీలచామరు, నీలచ్ఛత్రాదిభూషు నిలపతాకున్
నీలకరు రాహువు భువన, పాలుం బైకొనకుల భవు భావింతున్. 3
మ. అలప్రహ్లాదునితండ్రికిం జెలియా లేయా సింహికా కాంతకీ
యిలఁ బుత్రుండయి పుట్టి యయ్యమృత పానేద్ధక్రియన్ దేవతా
ఫలముంబొందిత మోఖ్య మండలమునన్ భానూత్ముఁడై సూర్యచం
ద్రిలసత్క్రాంత్యవరోధ వృత్తిఘనుఁడౌ రాహుం బ్రశంసించెదన్. 4

మ. భవబద్ధాజ్ఞులు దివ్యదృష్టిఁ గానమిందున్న ద్రూపముంగాంచలే
కవనీచ్ఛాయను నీనివాసమనె నీవంచుఁ వివాదించుచుఁ
భువనప్రాణులకొక్క నీడయనుచుల్ భోగంబులుంగూర్పహే
తువుగాఁజెప్పట కూడదంద్రు; వరసంతోషాశ్రితా! రాహువా. 5

క. నీడయె తాపముఁ బాపును, నీడయెనమ్మై రుధిరముఁ గప్పును మేనన్
నీడయెఘనమై దేహము, బాదువలచు నీడయీదె? ఫలములఁదముఁడా. 6

క. నీనీడసకలరాసుల, పైనంబ్రసరించుచుంట వలనఁదత్త
త్స్వనగుణరీతినిచ్చు ఫ, లానుభవము; చెట్లనీడ యట్లైతముఁడా. 7

ఉ. నీడఫలప్రదంబనిన నీవుఫలంబిడుదన్న శాస్త్రియా
వాఁడు నిరాకరించుటను బ్రాజ్ఞులుమెచ్చిరయేని జన్మకా
లోదుదశానుసారభవదుక్తశుభాశుభజాలమిచ్చి లో
కేడితమైన జ్యోతిషము నెక్కడ? దాఁచుదుమయ్య రాహువా. 8

క. కనుకనెనీడవిఫలదం, బనఁగూడదు; తత్పదార్థ మందతిసూక్ష్మా
త్మనుదగుతేజస్సారమె, యనయముఫలమిచ్చు; మీకనదెగతితముఁడా. 9

మ. అవనిచ్ఛాయను నీవునిల్పుటదియె ట్లంచుంజడుండాడు; నా
దివిలోమండలరాశియెట్లునిలిచెం; దేవాంశలింగాత్మయీ
భువనాళిన్ సకలప్రదేశముల నొప్పంగాదె? శ్రీ కామరూ
పవిశేషంబయి; దానిఁజూడఁగలఁడే? పాపాత్ముఁ; డో రాహువా. 10

మ. క్షితిఁగొన్నండ్లుశరీరమూనిపిదపన్ శ్రీ నాథచంద్రామృతా
గతసూక్ష్మాత్మతమోత్మధారివగుచున్ త్వచ్చాయయామండల
~~స్థితిదృష్టిఁ నడిపించుచున్ [illegible] రాహువా.~~ 11

చ. శనిగుణరాశి, ధైర్య, ముపనవ్యపుదొంగతనంపుమ్లేచ్ఛవ
ర్తనము, బోయరూపు, వనితాజనతాకుటిలస్వభావముల్
గనివిహరించునిన్మహిమ గాంచినమౌనులు దివ్యదృష్టిచేఁ
గనివచియింపమూఢుఁడది కల్లను; సూక్ష్మజగత్ప్ర! రాహువా. 12

మ. ధరణీజాతకజగ్రహంబుదిభర ద్వాజాన్వయంబైనఁ, ద
ద్ధరణీచ్ఛాయవెలైననీదియుభర ద్వాజాన్వయం జేయగున్
వరపైఠీనసగోత్రజుండనిమునుల్ వ్రాసిరి సన్మండల
స్థిరునిన్ బిల్చిరెయుంగలేఁదుజడుఁడీ దివ్యస్థితిన్ రాహువా. 13

ఉ. నిత్యముసర్వమున్స్మనుప నీలుగఁజేయఁగ నీదయాదరా
కృత్యనురూపులై భువికిఁ గేవలమాతయె యున్న ధేనువున్
మృత్యువుపేర వచ్చి దిగమ్రింగు పెదమ్మయు నన్న నీయధి
ప్రత్యధిదేవతల్ ననుఁ గృపామతిఁ బ్రోతురుగాత! రాహువా. 14

చ. ఎదురెటుగన్న లేక చను నేఁబదితొమ్మిదివేల యే బది
న్మిదిదశలం గ్రహాళిగనునిందు మనుష్యభవకాలరాసులం
దెపగను, చెవ్వరింగలసి, యేఘలకారత, నేయువస్థ, సే
పదమునునున్న గోచరభవత్త్రితి భద్రిమెయిమ్ము రాహువా. 15

సీ. ఖండన,దండ, ప్రచండ,కాలాహి, తస్కర, రంధ్రి, వల్మీక, గర్తజయము
భ్రష్టత్వ, సంకోచ, పతన, మహోత్పాత, ఘోరకలహ,బలాత్కారజయము
దేశాటన, మ్లేచ్ఛ, దీనతా,పస్మార, విధవా, జ్వర,విషూచి విధవిజయము
వైరాగ్య, బోధనవ్యవహారసాధన, ధనసౌఖ్య, ధైర్యప్రతాపములును
గీ. నీవొసంగు ఫలములెగాన నిత్యములుగ, గాత్రమున్నంతవఱకుసత్కరుణనిచ్చి
వ్యాధిమృత్యు జరాభవవ్యథలు లేని, ముక్తినిమ్మటుపైన సత్పూజ్యతముఁడ.

ఉ. శ్రీయుత ముత్యవెంకయకు రెండవపుత్రుఁడు ముత్యసూర్యనా
రాయణమూర్తి, సీతనధరామ్యఘదత్తకుమారుఁడావి నా
రాయణమూర్తిసేవన పరాయణ కిర్లంపూడివాసి పా
రాయణబుద్ధి లోకమువు రాయనఁ జేసెనిటుల్ తమస్స్తుతిన్. 17

క. దీనినిఁ జదివిన వ్రాసినఁ, బూనికఁ జదివించి విన్నఁ, బూజించిన దే
హానూన మనోబలములఁ, బూనిసుఖము గాంతురు జనములు రాహుదయన్. 18

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ.

# బృహస్పతిస్తవము.

శా. శ్రీమద్భాస్కర మండలోత్తరదిశా శ్రీమద్బృహన్మండలో
ద్దామోదజ్జ్వలఖమ్ము వృఁగోణచతురద్యద్దీర్ఘ పీఠస్థుఁడై
హేమాభాంగదగాత్రకుండల కిరీటోద్ధాక్షమాలాకృతి
శ్రీమద్దండ కమండలూరుకరుఁడౌ శ్రీజీవుభావించెదన్.

క. ఘనమతిఁ దూర్పుగఁ బద్మా, సనమునఁ గూర్చుండి చెంబు జపమాలను గ
ఱ్ఱును, గృతిఁ జతుర్భుజంబులఁ, గొని బుధగురుతఁ దగు గురుగురు మతిఁ గొల్తున్. 2

క. దివ్యహారుఁడు దివ్యరుచియగు, దివ్యరథం బెక్కి మేరు దివ్యగృహాద్రిన్
సవ్యగతిఁ జుట్టివచ్చెడు, దివ్యగురుం గొల్తు భవ్య దివ్యదభక్తిన్. 3

ఉ. ముప్పదిమూఁడుకోట్ల బుధపూగము లేఁబదియాఱు కోటులై
ముప్పుల నిచ్చు రక్కసుల మూఁకల గెల్చుట కెల్ల శక్తిమైఁ
దప్పక నిన్నుఁ గొల్చుటఁగదా! యిటు శ్రీబుధజీవనాటనీ
వొప్పు మనుంటి జీవుఁడను నుత్తమనామముతో గురుగ్రహా. 4

మ. ఘరుయుమ్మత్వరి చర్యమానిహారి ముఖ్యుల్ చాల సారుల్ శ్రా
చరసంఘాతము దే స్వారాజ్యపదవీ సౌఖ్యంబు గోల్పోయి పాం
దిరిచిక్కల్ ; గురుపూజమాని బుధులున్, నిశ్శేషపుణ్యావళీ
పరిపూతత్వము గానకుండిరె? గురుభావన్మండలస్థా! గురూ! 5

క. మండలమండలములనీ, మండలమె వెలల్పగుటఁ గుమండలగసుఖీ
మండలమెల్ల బృహస్పతి, మండల మన్నారు నీదు మండలము గురూ. 6

చ. నిరుపమ హేమవర్ణకర నేత్రములుం గడు పెద్ద దేహము౯
బరమపరోపకారముఁ గఫస్ఫుట తత్త్వము గల్గి యొప్పుసి౯
స్థిరబలదివ్యదృష్టిఁ గని చెప్పిన మౌనులఁ దిట్టుమాఘుఁడా
మారలనసూక్ష్మసృష్టిగతి, శోభితులన్న దెఱుంగ కో గురూ. 7

మ. ఇలఁ జార్వాకమతంబు నీరచితమం చెంచన్ లఘుజ్ఞాని ; లే
ఖులు లేరన్న మతంబు లేఖగురుతం గొన్నట్టి నీ వేమతిన్
నలువం బూనుదు? వా బృహస్పతియనం జార్వాకుఁడం బంపు లో
ఖ్యలలో నాకట్టి యా వెతిఁ గిక్కొనరి కాలంపుటల్పుల్ గురూ. 8

క. కనకపట! కనకచామర! కనకచ్ఛత్రాదికనక! కనకపతాకా!
కనకస్యందనధర! కనకతనూ! ప్రోవు! కినుక కనకసనుదయన్. 9

క. సకలాగమాదికలలకు, సకలబుధాలికిఁ బతివయి సకలాఘకరం
బ్రకట బృహస్పతి నామము, సకలసుమతిఁ గన్న నిన్ను నర్చింతు గురూ. 10

మ. తనహేమాశ్వసుతుంగాఁ గమంగొను టపార్థంబౌ జనీనామముం
గనిరయోంగోడ ; ఁటంగిరస్సుతుఁడవై కంజాతజాంశోద్భవం

వినయంగీష్పతినామమున్ స్థిరబుధశ్రేష్ఠత్వ సద్గౌరవం
బును గైకొన్న బృహస్పతుండలఘ నిన్ బూజింతు జీవా! గురూ 11

ఉ. నిత్యము భావివృద్ధిదత నీవలె నీప్రియమిత్రబంధులై
సత్యముగా సుకర్ములను సాఁకెను నింద్రమురుత్వధాతలన్
భూత్యనమానులధ్వరసుభోజనతృప్తి వహించునీ యధి
ప్రత్యధిదేవతల్ గురుఁడ! పావృత! మతుప్రలవృద్ధిలోపమున్. 12

చ. ఎదురెటుగన్న లేక చను నేఁబదిరామ్మిదివేల యేబఁదె
న్మదిదశలంగ్రహాళి గమనించు మదుద్భవకాలరాసులం
దెదిగను, దెవ్వరింగలసి, యేఫలకారత, నేయవస్థ, నే
పదమున నున్న నాచరభపఙ్క్తిని భద్రమె యిమ్ము; జీవుఁడా. 14

సీ. కష్టవిచ్ఛేదక తుష్టిసంపాదక పూర్ణమోదకగాత్ర పుష్టిధనము
లోకోపకృతిగాత్ర మాకరుణాపాత్ర పూర్ణజీవపవిత్ర పుత్రధనము
స్వానందసంధాన మానాయకధ్యాన పూర్ణబలనిధాన బుద్ధిధనము
దానవిధానప్రధానేహ వరసుశీతర సౌఖ్య ముఖ్యసాధనధనమ్ము

గీ. నీయుఁ దశాగ్రకస్వామివీవె గాన, బుధులనేలుకొను స్వజాతిపుణ్యమూర్తి
వంచునిను నమ్మి నీధ్యానమతులభక్తి, జేయుచుంటి నిడుము వాపు జీవ దేవ. 14

సీ. వేద,వేదాంత,సద్విద్యా,యశంబులు,మంత్రిత్వ,పాండిత్య,మంత్రములును,
ప్రణవంబు,శ్రద్ధయు,భక్తియు,మేధయు,బ్రాహ్మణ్య,పరిశుద్ధి, వాగ్బలములు,
జయపత్ర, ధన, సదాచార, వైష్ణవధర్మ, శిష్టత్వ ముఖ్యతా శ్రీగురుతలు,
సుఖ, గజాంతైశ్వర్యసుత దేవ గృహకర్మ,బాంధవవృద్ధిసుస్వర ముఖములు

గీ. నీప్రసాదఫలములెగాన నిత్యములుగ, గాత్రమున్నంతవఱకు సత్కరుణ నిచ్చి
వ్యాధిమృత్యుజరాభవ వ్యథలు లేని, ముక్తి నిమ్ము టుపైనసత్పూజ్యజీవ. 15

ఉ. శ్రీయుతముత్యపేఁకయుకు కొండవపుత్రుఁడు ముత్యసూర్య నా
రాయణమూర్తి, సీతనధరాబుధ దత్తకుమారుఁడాదినా
రాయణమూర్తి సేవనపరాయణ కిల్లముపూఁడివాసి, పా
రాయణబుద్ధిలోకము వురాయనఁ జేసి నిటుల్ గురుస్తుతిన్. 16

క. దీనినిఁ జదివిన వ్రాసినఁ, బూనికఁ జదివించివినినఁ బూజించిన దే
హానూనమనోబలములఁ, బూనసుఖము గాంతురు జనములు జీవదయన్. 17

# శనైశ్చరస్తవము.

శా. శ్రీమద్భాస్కరమండలాప్రతిదిశా శ్రీమందసన్మండలో
ద్దామేష్వాసనరూపపీఠమునఁ బ్రత్యఙ్ముఖాసీనుఁడై
శ్యామాభాంగద కుండలోరుమకుటోద్యత్తార్క్ష్యకత్రానధా
రామాన్యాసి గదాధరుండగు నహోరాట్పుత్రు భావించెదన్. 1

చ. ఘనముగఁ ద్రాసముఁ గదను గత్తిని వింటిని నాల్గు చేతులం
గొని బలుగ్రద్దమూఁపుపయిఁ గూర్చిన కార్ముకరూపపీఠమం
దనువుగఁ గూరుచుండినలుపౌనగలుందను నొప్ప మేనువుం
బనివడి నిత్యముం దరిగి, వప్పుశనైశ్చరు సంస్మరించెదన్. 2

ఉ. ఎండుట మెండు కండగొన కెత్తయి, మిక్కిలి లావు గట్టియుం,
బండతనంబు మెండయిన పాత్రత యొడల్ గనువిప్పఁగన్నులా
రొండిన పొట్టయున్ నలువు లేనిడు మూపులుఁ, జాలుజాలుగా
నుండిన మీసముల్ జడలు నుండిన నల్లని గాముఁ గొల్చెదన్. 3

ఉ. వాడిన మోముతో సకలభక్తగణశక్తిని ఘోరరూపమై
గ్రోడక నిత్యముం జనువు నుత్తమయోగ సుసాధకంబుతోఁ
గూడిన సత్త్వపోమహిమ కూడిక నెండిన దైనమేనితో
జాడల మెల్లగాఁ దిరుగు సామిని నల్లని గాముఁ గొల్చెదన్. 4

చ. మునిసుత కాస్యపప్రభవ మూర్తి వహించుట దివ్యదృష్టియుం
ఘనజనస్థితిప్రళయ కారణశక్తియుఁ బూని కోపముం
దినయెడ దేశనాఘనతి దీనునిఁ జేయుచుఁ దుష్టినం
దినమతిదీనుసన్ సకలదేశపుఁ జేసెడి కాలుఁ గొల్చెదన్. 5

క. నీలోత్పలతుల్యుండును, నీలగళనిభుండు, నిత్యనిరుపమబలుఁడున్
నీలమయూఖుఁడునైతగు, నీలగ్రహమునకొనర్తు నేర్పున వినతుల్. 6

చ. అనయము రాహుకేతువుల యట్లతినీలుఁడ వయ్యుఁ దద్విధం
బునఁ గనరాని కాయమును బూనక భానునుతుండ పాటుచే
ఘనముగు నిండ్రనీలమణి కైవడి భాసిలుచుండి లోకముల్
గనుఁగొని వేఁడ యోగ్యతను గాంచిన నిన్ను భజింతునో శనీ. 7

చ. సురనరసిద్ధసాధ్యదితిసూనుముఖుల్ భవదీయలోచనద్యు
క్స్ఫురణనశింతురా దనుజసూదనధాతృముఖుల్ స్వరాజ్యసా
గరసుతఁబాసిమూసెదరు; కంధిలతాపురవృక్షముఖ్యముల్
హారణమునొందు; నీకరుణ నన్నియుమేలుకొనున్ శనైశ్చరా. 8

శా. నీవేల్నాడయి వచ్చుటన్వినితనున్ నీవేమియుంజేయఁగా
లేవంచుంబురిఁబాసి కారడవిలో లీలన్ సరోమధ్యరా
జీవంబందలినాళమందులఘుతం జీవించెనేడేఁడులుం
దేవేంద్రుండె; నరుండు దాఁటఁగలఁడే? నీయాజ్ఞఁ గాలగ్రహా. 9

మ. నిజపుత్రేంద్రజిదుద్భవంబగుతఱిన్ నిర్మృత్యుఁడైవాఁడుభూ
ప్రజలోమండ గ్రహాళిలాభనసతిన్ బంధించెనారావణుం
డజపాతుండయినన్ భవద్వ్యయపదస్థాంఘ్రిన్ మృతింబొందెనాఁ
డజదుర్గంబ్యభవద్విధింగడతురే? యజ్ఞుల్ సికాటుల్ శనీ. 10

చ. ఘనకృశదీర్ఘదేహమును, గంటకరోమగణంబు మందవ
ర్తనకపిలాక్షులుం బవనతత్త్వము దారుణదీర్ఘదంతముల్
దనరఁగ మూడలస్థితినిఁ దాల్చిననిన్నరుదివ్యదృష్టిచేఁ
గనిమునులెల్లఁజెప్పనది కల్లనుమూఢుఁడు; సూక్ష్మభార్గజా. 11

క. నీదానహోమజపములు, భూదేవతలధికముగను బొనరించెదనీ
మేదినిగ్రహములలోపల, నీదగుగురుతఁగనికాదే? సి[illegible]లేశశనీ. 12

ఉ. ఎంతశనిగ్రహంబవని యెన్నికగాంచితొ తుష్టినొందితే
నంతయనంత సౌఖ్యమిడుదారయఁ; జేఁదగుమందెతిన్నరో
నంతటిరోగముంజెఱచి యింపులనింపునుగాన ధీరులెం
తెంతటిపూజలోనలిపి యెంతురునిన్ను గ్రహాధిరాట్సుతా. 13

ఉ. నిత్యము శాశ్వతాయువిడ నీవలెఁగారకులైననాగులై
సత్యముగానిజాశ్రితుల సర్వశుభాఢ్యులఁజేసిపేర్మి సాం
గత్యసుహృత్ప్రజాపతియుఁ గాలుఁడునాఁదగియున్ననీయగ్రి
ప్రత్యధిదేవతల్ రవిజ! పాపుత! మచ్చిరజీవభంగమున్. 14

క. కాలపటు! కాలదామర! కాలద్యుతాంగ! కాల! కాలపతాకా
కాలస్రక్చందనధర! కాలప్రభ! యిమ్ముమృత్యుకాలజయంబున్. 15

క. కాలవశా! కాలయశా! కాలదృశా! కాలసదృశ! కాలవినాశా!
కాలధరా! కాలచరా! కాలవరా! యిమ్ము మృత్యుకాలజయంబుల్. 16
క. అనయముఁ బ్రారబ్ధంబున, ఘనరోగావళులపీడ గనుదుం జన్మం
బను మృత్యువుఁ జూడనుభయ, మునుగను నాకిడు ప్రసాదమును సూర్యసుతా. 17
క. కరముగనికరమువగదిన, కరనుత! యాయువిడుము! బలకరమై, ప్రముదా
కరమై, కరమై, స్థిరమై, వరమై, వరమైత రేయ ఫలమిడకుండక. 18
చ. ఎదురెటుగన్న లేకచను నేఁబదితొమ్మిదివేలయేఁబది
న్మ్రిదివశలంగ్రహాళి గమనించు మదుద్భవ కాలరాసులం
దెదిగను, చెవ్వరింగలసి, యేఫలకారత, నేయవస్థ. నే
పదము ననున్నగోచర భవస్థితి భద్రమె యిమ్ము; కాలుఁడా. 19
క. ఈ నాఁడా నాఁడనకీ, వేనాఁడుపి శేషవిధిని నేల్నాఁడైనన్
నే నాడు వినుతిలోపము, పోనాడిశు భానుభూతిఁ బూనింపుశనీ. 20
సీ. పారిదర్యపేప్రిష్య బంధనగ్రహణ శిక్షాగేహ భృతినైచ్య కష్టజయము
ద్యూతపానకుకంతరి దుస్సహవాన, కిరాతశూద్రక్రియా వ్రిమఃఖజయము
కార్యభంగ క్లేశ గాధవ్యసన మౌర్ఖ్యవాతామయమదాది భయవిజయము
ములలోహకంబళీ తిలతైలభాండ నీలాంబర ఖర మృత్యులఁదకుంట
గీ. శిల్పపాదుకా ప్రాభవశివములనిడు, కారకుఁడ వౌట వానిసీకాయముఁదు
వలకునిడి జన్మవార్ధక వ్యాధి మృత్యు, రహితము క్తి నిమ్ముటుపైన రవితనూజ.

## శనిసవదండకము



శ్రీమన్మహా పావనంబైన శ్రీసూర్యవంశంబునం బూర్వకాలంబునన్ ద్వీపసప్తాదినాథుండు, సద్ధర్మవర్ధిష్ణు విఖ్యాతి నొందువాఁడు దశస్యందనేశుండు కౌసల్యకైకస్ సుమిత్రల్ వరప్రీతిఁ జెండ్లాడి పూజ్యంబుగా రాజ్యమెల్లం దయాపూర్ణుఁడై యేలుచుండంగ నాకట్లు దైవజ్ఞులా భీతిచెంచి శ్రీమన్మహారాజ! రాజాధిరాజా! మహాశూర! శన్యాఖ్య ఘోరగ్రహం బిద్దురారోహిణీ శార

హారోహణప్రక్రియం బొందు రేపేయుటుల్ శాకటగ్ర ప్రభేదంబు సేయంగ దేవాసురాద్యాతిభీతి ప్రదంబౌదుఁ బండ్రెండు సంవత్సరంబుల్ మహాదారుణంబైన దుర్భిక్షమే తెందు నట్లైట దేశంబులుం గ్రామముల్ సర్వలోకంబులుం జాల కంగారుచే భంగముంబొందునంచుజ్ వచింపందదీశుండు మంత్ర్యాళితో నాకులంబొందు రాష్ట్రప్రజా సంఘముంజూచి భీతిన్ వసిష్ఠాది సద్బ్రాహ్మణ శ్రేష్ఠులం గాంచి సర్వజ్ఞమౌనీశులారా! మహాదారుణ క్షామభంగంబు గావించు మేలౌ నుపాయంబు నేదేనియుంజెప్పరే! యందువేడంగ వారల్ మహారాజ! యీయోగమాబ్రహ్మరుద్రాదు లెంతెంచియున్ మాన్పఁగా లేరు, మేమే యుపాయంబు నూహింప లేముందుఁ జెప్పందశస్యందన క్ష్మాధినాథుండు చిత్తంబులోఁ గొంతచర్చించి బల్సాహసంబూని శుభ్రాశ్వసంయుక్తమై పెద్దజెండాను వెల్గొంది మాణిక్య కాంతిచ్ఛటా స్వర్ణతేజోమయంబై వసిష్ఠర్షి మంత్రప్రభావంబుచే సర్వదిక్కుల్ చరింపఁ మహాశక్తిగాలొన్న సుస్యందనంబెక్కి దివ్యాయుధోపేత చాపంబుచేఁ బూని భాస్వత్కిరీటస్థ మాణిక్యకాంతిచ్ఛటల్ దన్నునా కాశవీధిం ద్వితీయార్కురీతింబ్రకాశింపఁ జేయంగ మార్తాండుపై లక్షపై నిర్వదైదామడల్ దూరముందున్న యారోహిణీతారవెన్నంటి యాకృత్తికాంతంబు నందుండి యారోహిణింబొంద సిద్ధంబుగానున్న మందగ్రహంబుజ్ వృతిం బొందఁ జేయంగ సంహారకాస్త్రంబు సంధించి నిల్వంగ నాసౌరి దేవాసురాద్యాతిభీతి ప్రదక్రోధవహ్నిజ్వలద్భ్రూకుటీయుగ్మవిభ్రాజితాయాజి నీక్షించి హాసంబుగావించి యిట్లానెనో రాజ! విద్వేషులంజాల భీతిల్లఁగాఁజేయు నీపౌరుషం బెంతొ మోదంబిడెజ్ నాకు దేవాసురుల్ సిద్ధవిద్యాధరుల్ మర్త్యులుజ్ నీమహాతీక్ష్ణమౌ దృష్టిసోఁకజ్ భయభ్రాంతులౌచుండ్రు యుష్మత్తపస్సిద్ధికిజ్ మెచ్చితింగోర్కె నేదేనియుంగోరుకో మీ యసాధ్యంబుగానుంటి నాఁగందశస్యందనాధీశుఁ డీరీతిగా బల్కెనో కాలనామాతిభీమగ్రహాధీశ్వరా! వారిధుల్ సూర్యుఁడిందుండు నిందుండు దాఁకజ్ సుఖంబొందుచుం గృత్తికంగూడి భాసిల్లుమెల్లప్పుడుజ్ రోహిణిం బొందఁగాఁబోకు మీయొక్క కోర్కెం బ్రసాదింపుమాకంచు వేడంగ నాసౌరి యోవెట్టిరాజా! ముమ్ముందేవుఁడెల్లప్పుడుజ్ సర్వనక్షత్రసంచారముం జేయనేర్పర్చె నట్లుండఁగాఁ జెల్లదే రోహిణిం బొందినం దేనినింబొందినజ్ క్షామబాధల్ జగంబందు నేఁడాదిగానుండ వేవేళ నాదర్శనంబాశ్రితాళిజ్ వృథాసేయదంచుజ్ వరంబీయ నాయాజిధన్యత్వముం

గాంచి సంతోషమెచ్చఁగ రథంబందుఁ గోదండముం బెట్టి హస్తంబులఁ మోడ్చి విఘ్నేశ్వరుఁ భారతిం దొల్త ధ్యానించి భక్తిఁ శనిస్తోత్రముం జేయు నిట్లు మొదల్ వెట్టెఁ గృష్ణుండు, శితికంఠతుల్యుండు, నీలోత్పలాభుండు- నీలప్రభాఢ్యుండు నాశ్రీశనిస్వామికిఁ నానమస్కారకోటుల్ సమర్పింతు, నిర్మాంసదేహుండు, భాస్వజ్జటాశ్మశ్రుదీర్ఘుండు, రూక్షాక్షియుగ్మండు, శుష్కోదరుండౌ శనిస్వామికిఁ నానమస్కారకోటుల్ సమర్పింతు ఘోరుండు, రౌద్రుండు, సర్వాశనమ్లానవక్త్రుండు నాశ్రీశనిస్వామికిఁ నానమస్కారకోటుల్ సమర్పింతు. నిస్త్రింశుఁడుఁ మందచారుండు, భాస్వత్తపో దగ్ధదేహుండు, నశాంత సద్యోగనిష్ఠుండు, సుజ్ఞాననేత్రుండు, భాస్వత్కుమారుండు నాశ్రీశనిస్వామికిఁ నానమస్కారకోటుల్ సమర్పింతు, నో శ్రీశనిస్వామి! చిత్తంబులో నీవు సంతుష్టి గైకొన్న రాజ్యాదిభోగప్రదాగంబుగా వింతు నొక్కింత కోపంబు గైకొన్న శీఘ్రంబుగా మృత్యునోటంబడఁ దైత్యవాదిత్యులఁ రాక్షసుల్ మానవుల్పన్నగుల్ సిద్ధవిద్యాధరాదుల్ భవద్దృష్టి సోఁకన్ని మేషంబులో దీనులై పోదురా బ్రహ్మగోవిందరుద్రాదిః పతిశ్రేష్ఠ దేవాదిదేవాధినాథుల్ భవత్క్రూరదృష్టిఁ స్వరాజ్యాధికారంబులం బాసి దుఃఖంబులం గందురు; దేశంబులుం గ్రామముల్ ద్వీపముల్ చెట్లుతీఁగల్ మొదల్గల్గు దృశ్యంబులెల్లఁ భవద్దృష్టిదాఁకన్ మొదల్ తోడ నాశంబులై పోవు, నో శ్రీశనిస్వామి! దుర్వారశక్తీ! ప్రజాసౌఖ్యముం గోరి నీసన్నిధిం జేరి నీ వేఁడుచున్నట్టి నన్నుఁ భవద్దాసుఁ బ్రీతింబ్రసాదోరు కారుణ్యవీక్షుండవై చూచి రక్షింపు రక్షింపు రక్షింపుమో శ్రీశనిస్వామి! యో శ్రీశనిస్వామి! యో శ్రీశనిస్వామి! నీకుఁ గావించు జోహారి దేయంచు మ్రొక్కంగ నా సౌరి యాజిస్తుతిం జాల సంతుష్టుఁడై వత్స, నోరాజ! నీస్తోత్రమెంతో ముదంబిచ్చె నాకిప్డు దేదే వరంబీవు వఁ గోరుకొమ్మిత్తునందు న్వచింపం దశస్యందనేశుండు దానిట్లు గాంక్షించెనో శ్రీశనిస్వామి! వేదాదిగా నీవు గీర్వాణదైత్యప్రజాజంతుపక్ష్యాదికప్రాణులంబీడగావించుటన్మాని సౌమ్యస్వభావంబుతో మంచివాఁడన్న సత్కీర్తి భాసిల్లవే! యందు వేఁడంగ నా సౌరి యిట్లాడెనో క్షత్త్రరాజా! జగద్ద్రోహకత్వంబుచే మాకుఁ బీడాకరంబౌ గ్రహాఖ్యల్ మహాదేవుఁ డేర్పర్చెఁ గానన్ భవద్యాచితంబౌ వరంబీయఁగాఁ గూడదైనన్మహాభక్తి నీవిప్డు దద్దానిచే నన్ను సంతుష్టుఁ గావించి తా నా స్తుతిఁ మర్త్యుఁ డేరోఁజు వీనైనపర్యాయముల్ పారముంజేసినం బీడ యొక్కింత

యుంబొందఁ డెవ్వారిచేనైనఁ బారంబు సేయించినన్ వానికేవేళలం బీడరాకుం
డుః జన్మాష్టమద్వాదశ స్థానగత్వంబునేనొందు వేళన్మనుష్యుండు శ్రద్ధన్ శుచి
త్వంబునన్ మద్గతస్వాంతుఁడై మందవారంబునన్ మామకంబౌ నయోలోహరూ
పంబు పూనిక్ర శమీపత్ర పుంజంబుచే నీఘనస్తోత్రమార్గంబునన్ నన్నుఁ బూజిం
చి యీస్తోత్రమున్ నామహామంత్రరాజంబు నిష్ఠం జపింపన్ముదంబంది నేవారి పీ
డల్ నివారించి కోర్కెల్ సదా యిచ్చుచుందున్మదిందీవు కేమాత్రముల్ సంది
యింబందఁగాఁ గూడదంచున్ వచింపం దశస్యందనోర్వీశుఁ డానందియై సౌరి
యాజ్ఞన్ స్వధానిం బ్రవేశించి యారీతిగా రాష్ట్రమర్త్యాళికిం జెప్పిచేయించి తాఁ
జేసి పీడావినాశంబు దుర్భిక్షనాశంబుగావించె మందగ్రహారాధనం బెల్ల వర్ణోద్భ
వుల్ సేయఁగానొప్పు శూద్రుల్ విశేషించి ముఖ్యంబుగాఁ జేయఁగానొప్పు నంచు
న్మహోద్యత్ప్రభాజాత సంపూర్ణమాహాత్మ్య సంపన్నుఁడై దివ్యశక్తి ప్రదాథర్వ
ణామ్నాయభాగంబు దేవుండు మాటల్గ బోధించియుండంగ వానిన్ మహామం
త్రముల్ గాఁగ మేలైన ఛందస్సుతోడం గవిత్వంబు గావించి ప్రఖ్యాతిచే బ్రహ్మ
తోఁ దుల్యుఁడైయున్న శ్రీగాధిపుత్రుండు, బ్రహ్మర్షిపూజ్యుండు, బ్రహ్మర్షిము
ఖ్యుండు, లోకోపకారోరుదీక్షున్ శనిస్తోత్రచారిత్రమీరీతి లోకంబునం దెల్ల వ్యా
ప్తంబుగాఁ జెప్పె; నోసౌరి! కృష్ణా! శనైర్గామి! ఖంజా! యమా! లోకవైరీ! గ్రహాగ్నీ
శసంభూత! ఛాయాసుతా! మాతలీ! నారకా! రాక్షసా! సర్వలోకాంత! రక్తాక్ష!
యుద్ధప్రియా! కుబ్జ! మందా! ప్రమత్తా! మహాస్థూల! శ్రీవేదబాహ్యప్రజానాశ!
యో శ్రీశనీ నన్ను రక్షింపవే! యందు నీయుక్తదోర్భాఖ్యలన్ మూఁడుసంధ్యల్
జపింపన్ శనిప్రీతి యొంటందదీయోరు పీడల్ జనుల్ పొందరే వేళనంచున్ శరం
బూనియున్ బావకుం బెట్టియున్ శత్రులుం జావఁగాఁ జాలు శ్రీగాధిభూదేవుఁడ
త్యంత పుణ్యుండు వ్రాకుచ్చెఁ; గోణస్థ! యోపింగళా! యో బభ్రూ! మహాకృష్ణ!
రౌద్రా! యమా! యంతకా! సౌరి! మందా! శనైర్గామి! నగ్గావుమంచీ దశాఖ్యల్
పఠింపన్ నరుల్ పొందరే వేళనైనన్ శనిప్రోక్తపీడాముఖంబున్ ఘనఖ్యాతియా
పిప్పలదర్శిసెప్పెన్. జగంబందు నీమూఁడుమార్గంబులన్ మీఱు నార్షేయమౌ
శ్రీశనిస్తోత్రముంగల్గి భాసిల్లు సిదండకంబున్ మహాభక్తితోఁ బ్రత్యహమ్మెక్క
సారేని పాఠంబుగావించినన్ శ్రీమదధ్యాత్మరామాయణాఖ్యాన పారాయణోక్త
ప్రకారంబుగా శ్రీశనిస్తోత్ర పూజోక్తమౌ సత్ఫలంబందరె మర్త్యుల్ సుఖంబంది

యుండ్రించు నిశ్శేషదేవాది లోకాధినాథుఁడు రమానాథుఁ జిత్తంబులో నిల్పి పూ
జించుచుండన్మహాపూర్ణకారుణ్య సంప్రాప్తభాస్వత్కవిత్వాభిరామత్వమే పొందఁ
గా నతకృపకుల్ చేసికొంచున్ సదాసర్వవిద్యా రసగ్రాహకత్వంబుచే మీఁది
గోదావరీఖండ పెద్దాపురీభాగమందొప్పు శ్రీకిర్లమాఖ్యాన్విత శ్రీపురిం గాఁపురం
బుండి సద్భక్తిజాలోత్తమానంద సంపూర్ణ సంపన్నుఁడై యొప్పు శ్రీముత్యవంశో
ద్భవాత్యంతధీ సూర్యనారాయణాఖ్యాగ్రజన్ముండు వాక్రుచ్చె నో శ్రీశనిస్వామి!
మందప్రచారా! గ్రహాధీశ భాస్వత్కుమారా! దయాసార! యాకీర్తిఁ గావించి లో
కంబులఁ బ్రేమ రక్షింపవే! శ్రీశనిస్వామి! కైకొమ్ము నీకేమ గావించు సంపూర్ణ న
వ్యక్తిసంపన్న సుశ్రీ నమస్కారవారంబిదే! శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ. శ్రీ. శ్రీ.

# బుధస్తవము.

శా. శ్రీమద్భాస్కర మండలేశ్వరదిశా శ్రీసౌమ్యసన్మండలో
ద్ధామద్విట్ప్రరూపపీఠిని మహోదగ్దిఙ్ముఖాసీనుఁడై
హేమాభాంగద హేమకుండలకిరీటోద్ధాంగ హేమాభుఁడై
శ్రీమచ్చర్మగదాకుఖడ్గకరుఁడౌ శ్రీసౌమ్యు భావించెదన్. 1

క. కనకాంగమకుటపటములు, దనరఁ జతుర్భుజములమగ దాచర్మాస్త్రా
సిసిరుపమువస్తువులుదగఁ. బనివడి హరి నెక్కినతిప్రీతుఁ దలఁతున్. 2

క. పీతపట! పీతచామర! పీతచ్ఛత్రాద్యుపేత! పీతపతాకా!
పీతస్రక్చందనధర! పీతతనూ! నిన్నుఁ దలఁతుఁ బ్రీతిం బ్రోవన్. 3

మ. సతిశాపాహతయానిశాసతికి భాస్వచ్చంద్రమోవంశమున్
సతికారుణ్యముచే ముగండయిన తత్సత్కాంతకేసూర్యసం
తతియుం బుట్టఁగఁ జేసి తన్నిపుణతం దత్త్వారాణక్రియ
స్థితికిన్ మూలమువై వెలుంగునిను చింతింతున్ సుధాంశోద్భవా. 4

ఉ. ముప్పదిమూఁడుకోట్లుగల, ముప్పదియేఁడుల పెద్దలందఱుం
జప్పుడుకున్ సమూహనిధిచే బుధనామమునొందిరీవా రయు

ల్లవ్వాడు శ్రీబుధాభిధనై యుండితి; నీకు సమానులేరి? ని
న్నెవ్వఁడుఁ గొల్చు సన్మతులహీనబుధత్వమునొందరే? బుధా. 5

చ. సకలకలావిశారదత సద్గురుఁడైన సుజీవు కాంతకున్
సకలకళావిశాలతను సన్నుతిఁగన్న సుధాంశుమూర్తికిం
బ్రకటసుతుండవైననిను భవ్యకలావలులొందకున్నె? నీ
ప్రకటదయం గడించుకొనువారు కలావలులొందరే? బుధా. 6

క. అమృతాంశాంశోద్భవుని, న్నమితను సౌమ్యత్వవిభవు నాత్మనిలుపు ను
త్తమితను హృత్తాపనముద, యము నయమునిను సేరకున్నె? యలఘుమతి బుధా. 7

ఉ. స్థూలశరీరదృష్టినిఁ జూచినచోఁ బ్రళయంబదండ్రి స
త్కాలగుణజ్ఞులో బుధులు; దాంతతసూక్ష్మశరీరదృష్టి నీ
లీలను జూచినేనినది లింగతను ప్రళయంబుసేసి ని
త్యాలఘుసౌఖ్యమిచ్చు నమృతాప్తినిభక్తులకీయుదే? బుధా. 8

ఉ. స్థూలశరీమూనిముల శోభిలిపిమ్మటఁ గాంతిభూతమై
కాలెడుసూక్ష్మదేహమునఁ గామవిహారత, మండలస్థితిం
జాలవెలుంగునీచరిత సత్యమెఱుంగఁగలేక చూనిరా
జ్ఞాలవచఃపురాణముల సారెకుమూఉను మూఢుఁడో బుధా. 9

క. పరిహాసభావ, గద్గద, పరగళ, ధాతుక్రియాంగభాగుఁడవగు నీ
వరరూపము సెప్పినబుధి, వరులన్నిందించు ఖలులఁ బ్రాజ్ఞేందుసుతా. 10

మ. నరసాన్నాంబరదౌషధీశుఁడగు యుష్మత్తాతుఁడస్మత్ప్రభుం
డరయన్నిత్యము యుష్మదాంబికసుతారాచ్ఛత్వముల్ నీ బుధ
త్వరుచింగోరు మహర్షిజాతులము, నీ బాంధవ్యమెల్లప్పుడున్
స్థిరమైయున్నదె మాకు; నేలుకొనవే! శీఘ్రంబె మమ్మున్ బుధా. 11

క. అవనిన్ "సోమః పశ్రిథమో, వివిదే" యనియున్న వేదవిధి చేనీవ
న్నవుపెద్దవునైపలు వా, వివరునలఁగలసితివిమకు విడువకుము బుధా 12

క. ఘనపుణ్యముచే నాకం, బునవిలిచినకలజగములుఁ బూర్ణసుదృష్టిం
గనుచున్న నీవు ఫలమీ, యనిచోదికెవ్వరు? జడులమగు మాకు బుధా. 13

ఉ. నిత్యము సౌమ్యభావమున నీవలెనీమదినున్నయాద్యులై
నస్యముగా సమగ్గులు రుశాశ్వతమోక్షమునొందఁజేము సాం

గత్యముతోడఁ జేయుమహికాంతుఁడు, బ్రహ్మమునన్న నీయధి
ప్రత్యధిదేవతల్ బుధుఁడ! పాపుత! ధీకరసత్తమంబుల౯. 14

చ. ఎదురెటుగన్న లేకఁ దను నేఁబదితొమ్మిదివేలయేఁబదే
న్మిదిదశలం గ్రహాళి గమనించు ముదుద్భవ కాలరాసులం
దెదిగను, చెవ్వరింగలసి, యేఫలకారత, నేయవస్థ, నే
పదమున నున్న, గోచరభపఙ్క్తిని భద్రమె యిమ్ము! సౌమ్యుఁడా. 15

మ. స్థిరమౌ కేవలసద్బుధాఖ్యను, బుధజ్యేష్ఠత్వసంపన్నతన్,
వరవాణీచతురాస్యసంపదను, శిల్పప్రౌఢసృష్టిక్రియన్,
హరిపాదాప్తగతిన్, బయోజజతి బ్రహ్మణ్యాండవైయుండుని౯
స్థిరభక్తిం దలఁతుం జిరాయువిడి రక్షింపంగ రావే! బుధా. 16

సీ. కౌమార, వాణిజ్య, కావ్య, గణిత, లిపి, బుద్ధి, యుక్తులు, శిల్ప, పుణ్యగతులు,
మాధ్యస్థ్య, సంధాన, సహిత చాతుర్యముల్, నౌకాగమన జయ, నయగుణములు,
ముద్గాది సస్యసంపూర్ణలాభఁబులు, సౌభాగ్య, కన్యకాసంతతులును,
వ్యజన, పంజర, కీర, వరవిచిత్రవిహార, తాంబూల, సంభోగతతసుఖములు,
గీ. నీవొసఁగుఫలములెగా ననిత్యములుగ, గాత్రమున్నంతవఱకు సత్కరుణ నిచ్చి
వ్యాధిమృత్యుజరాభవవ్యథలు లేని, ముక్తి నిమ్మటుపైన సత్పూజ్యసౌమ్య. 17

ఉ. శ్రీయుతముత్యవెంకయకు రెండవపుత్రుఁడు. ముత్యసూర్యనా
రాయణమూర్తి, సీతపథరాబుధదత్తకుమారుఁ, డాదినా
రాయణమూర్తి సేవనపరాయణ కీర్లమపూఁడివాసి, పా
రాయణబుద్ధి లోకము పురాయునఁ జేసెనిటుల్ బుధస్తుతి౯. 18

క. దీనిని జదివిన, వ్రాసినఁ, బూనికఁ జదివించివిన్నఁ, బూజించినదే
హానా నమనోబలములఁ, బూనిసుఖముగాంతురు జనములు సౌమ్యదయ౯. 19

# కేతుస్తవము

శా. శ్రీమద్భాస్కరమండలానిలదిశా శ్రీకేతుసన్మండలో
ద్దామశ్యామలకేతుపీఠమున సద్ధ్యామ్యాననాసీనుఁడై
హేమాభాంగదచిత్రకుండలకిరీటోద్భాతిమాభూషితుఁడై
శ్రీమద్బ్రహ్మగదాసిశూలకరుఁడౌ శ్రీకేతు వంగొల్చెద౯. 1

క. అవనిచ్ఛాయకుఁ గేంద్రం, బవు శుభ్రాంశునకుఁ గేంద్ర మవు రాశి నిరా
హువునకు నేడిట నమృత కరవర చ్ఛాయఁ దగు కేతుఁ బ్రార్థింతు మదిన్. 2

చ. అమృతముఁ గ్రోలు దైత్యు హరి యారసి గొంతుకఁ గోయఁ బ్రహ్మ స
ర్పముకటిఁ గోసి తోఁకఁ దల వాని శిరంబున మేనఁ దిన్నగా
నమరిచి రాహుకేతువు లటంచు వచించి ఖవాసమీయఁ బై
నమరిక నిష్ట రాహువను నార్యనుతిం గొను కేతుఁ గొల్చెదన్. 3

క. తనకతికించిన ఫణిపతి, ఘన జైమిని గోత్రుఁ డగుట గాత్రాగ్రారం
బును శిర మెయగుట జైమిని, ముని గోత్రుఁడనఁ దగు కేతు ముదమునఁ దలఁతున్. 4

చ. ఘనగద, శూల చర్మములఁ గత్తిని నాలుగు చేతులందుఁ జే
కొని యహిరాట్ఫణావికృత ఘోర ముఖంబును ధూమ్రవర్ణమౌ
తనువు నెసంగఁ బావురపుఁ దత్తడితో నపసవ్యచారతం
బనివడి మేరువుం దిరిగి వచ్చెడు కేతువు సంస్మరించెదన్. 5

క. చిత్రపట! చిత్రచామర! చిత్రచ్ఛత్రా! విచిత్ర చిత్రిత కేతూ!
చిత్రస్రక్చందనధర! చిత్రప్రభ! ప్రోవు! గాత్రచిత్రను కేతూ. 6

సీ. మంత్రతంత్రక్రియా మహిమ చేనొప్పారి పక్షిశకునములు పలుకఁ గల్గి,
రోగచికిత్సలు బాగుగాఁ జేయుచు, నుపకారము మఱవ కొప్పుచుండి,
పాములం బట్టెడు వాండ్రను భిక్షుని బైరాగివాని రూపమునఁ బోలి
తీర్థయాత్రాదికుఁ దీపించి, దైవబలమున యోగాభ్యాసమమరఁ బూని
గీ. శంకరకులజాతుండవై చంద్రుచాయఁ, దనరు నిను దివ్యదృష్టిచేఁ గనిత పనులు
ప్రజల కందఱికిని దేటపఱుప నద్ది, కల్పితంబను మూఢుఁడు కనక ఘూమ్ర 7

మ. నిను నా రాహువుఁ గూర్చి కొందఱు సుధీనేత్రిశులే వ్రాయకం
టనుమీరల్ గ్రహనామబాహ్యులని యాడం జొక్కఁ డొక్కండు; మీ
ఘనసత్త్వద శాఫలంబు లెట దాఁగంబోవు? నజ్ఞానుల
న్నను నాక్షేయము సత్యమై చనునె? నానావర్ణదేహా! ధ్వజా. 8

మ. ఎదురెటుగన్నలేక చను నేఁబదితొమ్మిది వేల యేఁబదె
న్మిది దశలం గ్రహాళి గమనించుమ దుద్భవకాల రాసులం
దెదిగను, చావ్వరింగలసి, యేఫలకారత, నేయవస్థ, నే
పదమున నున్న, గోచరభవర్తిని భద్రమెయిమ్ము! కేతువా. 9

ఉ. నిత్యముఁ బూర్వకర్మగతినింపినొసళ్ళనువ్రాయుబ్రహ్మ య
న్నత్యజగద్విభుండు, నధునాతనకర్మము వ్రాయుధర్మరా
డ్భృత్యక చిత్రగుప్తుఁడను సృష్టివిలేఖుఁడునన్న నీయధి
ప్రత్యధిదేవతల్ మదఘపఙ్క్తులవ్రాయక కావుతన్ ధ్వజా. 10

క. శాత్రవమిత్రత, గాత్రపవిత్రత, క్షేత్రసులతాలవిత్రతఁ, బౌత్రి
పుత్రకళత్రసుగోత్రతఁ, జిత్రాంత్రతనిమను! విచిత్రతగాత్రా. 11

సీ. పైత్య, లోభ, కలహ, పైశున్య, దంభోక్తి, హితభేద, విపవ, సతతజయము
భిక్షాటన, వికార, కుక్షింభరిత్వ, గుహాప్రవేశాదిభయవిజయము
కార్తాంతికత్వ, సత్కీర్తి, చికిత్సకతా, శాకునికతా, ప్రవాపములను,
జ్ఞాన, వైరాగ్య, మోక్ష,మత, నిధ్యంజనసాధనా,దృభతకర్మ, శైవగతులు
గీ. నీవొసఁగుఫలములెగాననిత్యములుగ, గాత్రమున్నంత వఱకునతర్కుణనిచ్చి
వ్యాధిమృత్యుజరాభవవ్యథలులేని, ముక్తినిమ్ముటపైననతూర్వజ్యభూప్రు. 12

ఉ. శ్రీయుతముత్యవెంకయకు రెండవపుత్త్రుఁడు, ముత్యసూర్యనా
రాయణమూర్తి, సీతనధరాబుధదత్తకుమారుఁ,డాదినా
రాయణమూర్తి సేవనపరాయణ కిర్లమపూఁడివాసి, పా
రాయణ బుద్ధిలోకమవురాయనఁజేసెనిటుల్ ధ్వజస్తుతిన్. 13

క. దీనినిఁజదివిన, వ్రాసినఁ, బూనికఁజదివించివిన్నఁ, బూజించినదే
హానూనమనోబలములఁ, బూనిసుఖముగాంతురు జనములు కేతుదయన్. 14

## శుక్రస్తవము.

శా. శ్రీమద్భాస్కర మండలాదిమదిశా ప్రీశుక్రసన్మండలో
ద్దామప్రాఙ్ముఖ పంచకోణవిశదోద్యత్పీఠికాసీను ప్రై
హేమాభాంగదవజ్రకుండల కిరీటోద్దామమాలాకృతి
శ్రీమద్దండకమండలూరుజటుఁడా శ్రీకావ్యభావించెదన్. 1

క. శ్వేతాంబరు, శ్వేతాశ్వుని, శ్వేతధ్వజచామరాద్యు, శ్వేతచ్ఛత్రున్,
శ్వేతసరోజ్యందనధరు, శ్వేతాంగుని, శితశీలు, శ్రీకవిఁదలఁతున్. 2

క. దివ్యహయు, దివ్యరుచియుగు, దివ్యరసంజీవిని మెరుదివ్యగృహతీర్
నవ్యగతిఁజూట్టివచ్చెదు, దివ్యవరున్ నిన్నుఁదలఁతు దివ్యాకార్యా. 3

క. భయకరరాక్షసరాజని, చయహర! ధృతరామనామసంతతకీర్తీ!
నయవినయాశ్రితశివకళ! వయఃకలితగాత్ర! భార్గవా! నినుఁదలఁతున్. 4

క. సకలగ్రహములలోపల, నకలంకరుచిం ద్వితీయహరివైతత్పూ
ర్ణకరుసమీపంబున నది, వ్యకళం జెన్నారు నిన్ను భావింతుఁగవీ. 5

మ. మృతసంజీవనిశక్తివాకచునికిన్ మేనంబ్రవేశించుటన్
మృతిభీతిన్ విముఖంగఁజేయుటను "ఛీమ్లేచ్ఛాశనంబాసురన్
కిది దేవుండు గ్రహింపరా" దనినడన్ శిక్షించి యాత్మానుభూ
తతఁదత్పాపనివృత్తి నిల్పిననినున్ ధ్యానింతుఁగావ్యప్రభూ. 6

మ. తనపాదంబునఁగట్టితన్నదిని "త్వత్పాదంబు బల్ నొప్పిసే
సెనె" యంచుంగొనియొత్తు భార్గవిధవున్ శ్రీశాంతుయజ్ఞేశ్వరుం
బనిశాసించినబ్రహ్మమౌని భృగుపూజ్యజ్యేష్ఠపుత్రుండవౌ
నినుఁ శ్రీమాధవభక్తిసిద్ధివడయన్నింతింతు శాంతింగవీ. 7

మ. అనఘ శ్రీహరిభక్తుఁడా హరియె తన్నర్థించి సందేహమై
ననసంగన్ వెనుదీయఁడంచు బలి "కానారాయణుండీవటుం"
డనుచుం దెల్పి బుధుండనే యగుట దివ్యశ్రీబుధేంద్రుం గృతా
ర్థునిఁగాఁజేసిన నీస్వజాతిహితకారుణ్యంబు నెంతుంగవీ. 8

మ. శర్మిష్ఠాసుతయూలమైతనదు వంశం బాస్థిరంబైననా
శర్మిష్ఠోదరముఖ్యకారణము యుష్మత్పుత్రియే యాటఁద
ద్ధర్మంబెంచి నిజాచ్ఛధామసదృశత్వద్ధామము న్బ్రీతిన్
శర్మంబొప్పఁగ్రహించి నీకళఁగొనెం జంద్రుండు మైత్రిం గవీ. 9

క. బలమృతసంజీవినినీ, కళఁగొనకుండిన శశితనకళఁగొన్నబుధా
వళికజరామరణంబులు, కలుగనికాయంబు నీయఁగలఁడే? శుక్రా. 10

మ. జననంబాయని మేషులందగుట సుప్రైస్థానమైయొప్పనీ
కని మేషాహ్వయరాశి; బ్రహ్మఋషిచర్యన్నిష్ఠఁగైకొంటఁగ
న్యనునీచాలయదృష్టిఁగంటివపురా! యాత్మానుగుణ్యస్థితుల్
గను టేలోకమునందు నైజమెయొకో! కావ్యా? సుకావ్యాళిదా. 11

మ. భవదాచార్యతచే హిరణ్యకశిపుర్ వైకుంఠవైరాది సం
భవుఁగావించితివే! తతగ్రసుతుఁడౌ ప్రహ్లాదువైరాగ్యవై

భవుఁగావించితె! యాత్మజాతకదశా భావాభిధస్థానసం
భవతద్గ్రహచారకారణముచే వర్తించిరట్లోకవీ. 12

చ. సురుచిరగాత్రనేత్రములు, సుందరవక్రవినీలకేశముల్
వరసుసుఖానురక్తి, కఫవాతగతత్వముగల్గియొప్పుసన్
స్థిరబలదివ్యదృష్టిఁగని చెప్పినమౌనులఁదిట్టుమూఢుఁడౌ
సురలనసూక్ష్మదృష్టిగతి శోభితుఁడౌటయెఱుంగ కోకవీ. 13

మ. దివిశుక్రాహ్వయమండలాంతరమునందీపించు నీగాథలన్
భువిమూఢాత్ములసత్యమందు వదరున్ భూమింబలీంద్రాఖ్యభూ
ధవుచెంబునసూక్ష్మదేహరుచితోఁ దాఁగన్ సమగ్రాండవా
భవదుద్యన్మహిమంబెఱుంగఁగలరే? పాపాత్ములో భార్గవా 14

ఉ. నిత్యమువృష్టివృద్ధిదతనీవలె వృష్టినిసంగమమ్ములై
సత్యముగాజగద్వితతిసారఫలంబులనొందఁజేయుమ సాం
గత్యముతోడఁజేయుహరికాంతయు నిందిరయున్న నీయధి
ష్ఠత్వాధిదేవతల్ భృగుజ! పావక! మద్బలభోగభంగమున్. 15

చ. ఎదురెటుగన్న లేకచను నేఁబదితొమ్మిదివేల యోఁజనే
న్మిదిదశలంగ్రహాళి గమనించుమదబ్దవకాలరాసులం
దెదిగను, చెవ్వంగలసి, యోఘలకారత, నేయవస్థ, నే
వదముననున్నఁ గోదరభవచ్ఛ్రీభద్రమెయిమ్ము భార్గవా. 16

సీ. సౌహార్ద, మంత్రిత్వ, సహనతా, ప్రాబల్య, దృష్టి, వకాళ, సువృష్టిఫలము.
లలితభోగంబు, లంగనానంభోగ, శయ్యా, వినోద, భోజన, సుఖములు,
కామ, కేళీ, గాన, కౌశల్య, సౌగంధ, సుకుటుంబ, సుకళత్ర, సుఖబలములు,
రజిత, మౌక్తిక, పాండురసువస్త్రవాహన, పాదరక్షా, కవిత్వాదికములు,

గీ. నీప్రసాదఫలములై గాననిత్యములుగ, గాత్రమున్నంతవఱకు నతఁడరుణనిచ్చి
వ్యాధిమృత్యుజరాభవవ్యథలులేని, ముక్తినిమ్మటుపైనసత్పూజ్యశుక్ర. 17

ఉ. సుద్దులకీవి, మోవి, బలుసోయగమం, దెలిజిల్గుపచ్చయం
చద్దినచీరఁజూచి మగఁడన్ గ్రకుటెన్ నొక్కిటి చెక్కిలిన్
ముద్దుగనంగ లేవగ వుముద్దులు గులకఁగఁ జౌక్కుపరికల్
సద్దనియుంతలో వెదరు చక్కరబొమ్మనుగూర్చు మోకవీ. 18

క. నవ్యకథానవ్యవిధా, భవ్యకథాన్వితమగుటఁ బాపురవిబుధ
శ్రావ్యంబై, దివ్యంబై, భావ్యంబౌ కావ్యకర్తృపథమిదు! కావ్యా. 19

శా. నానాశ్రీస్మృతిపారగుండయిన ఛందశ్శాస్త్రధీయుంగవి
త్వానూనప్రియుఁడైకృతిన్ స్వజననంబౌ రాశిచక్రంబునన్
నీనిర్దుష్టస్థితిశ్రీకయుండినని శానింపంగఁ దానింపఁగన్
నానాలంకరణాళిఁ; జాలఁడెవుడున్సభ్యార్త్ర! కావ్యా! కవీ. 20

చ. అలఘుగుణాదులిద్ధగతినందనియా శుకవిత్వపద్యల
క్షలును, శతావధానములుఁ, జర్వితచర్వణకావ్యకోటులున్
సలుపుదురల్పచర్చులు; లసద్భవదీయదయన్ సుకల్పనం
జెలఁగెడునొక్క పద్యము రచించినఁగీర్తికిఁజాలదే? కవీ. 21

క. ఎందోయున్నదిబ్రహ్మ, నందంబను చంద్రుగాని; నవనవకవనా
నందమె సాక్షాద్బ్రహ్మా,నందంబది నీవరకరుణం దొరకుఁగవీ. 22

ఉ. శ్రీయుతముత్యవెంకయకు రెండవపుత్రుఁడు, ముత్యసూర్యనా
రాయణమూర్తి, సీతనథరాబుధదత్తకుమారుఁ, డాదినా
రాయణమూర్తి సేవనవరాయణకిర్లమపూఁడివాసి, పా
రాయణబుద్ధిలోకమవురాయనఁ జేసెనిటుల్ కవిస్తుతిన్. 23

క. దీనినిఁజదివిన, వ్రాసినఁ, బూనికఁజదవించివిన్నఁ, బూజించినదే
హానూనమనోబలములఁ, బూనిసుఖముగాంతురు జనములు శుక్రదయన్. 24

## ఏతద్గ్రంథపఠనాదిఫలము.

మ. ఘనముత్యాన్వయసూర్యనాముకవి సత్కావ్యగ్రహస్తోత్రమే
దినమందొక్క పరింబఠించునెడ శాంతిప్రాప్తగాయత్రులం
గొనకున్నట్టియఘంబుపోవ నెపుడుం గోర్కుల్లభింపన్నరుల్
గనిమోదింతురుసర్వభావశుభముల్ కళ్యాణదా! రాఘవా. 25

సీ. గ్రహవారములనదాగ్రహనుతిఁజేయుచుఁ బ్రతివత్సరాంత్యవారంబునందుఁ
దత్తదహస్సులందత్తద్గ్రహంబుల స్తోత్రముల్ దానముల్ సొరిదిఁజేసి
రాహుకేతువులస్తోత్రంబులుందానముల్ శనివారమునఁజేసినరసభక్తి
రవివారమున విప్రసపకసంతర్పణంబును జేసి యాకృతింబూజఁజేయ

గీ. సకలవర్ణోద్భవులగుజనులు సకల, పీడలను బాసి శుభములం బ్రీతిఁ గాంద్రు
నియమమొకటిలేదు దీనికెన్నఁడున్న, గౌళికాదులు పల్కిరిగాదె? రామ. 26

క. పదియునందొమ్మిదివందల, పదిరెండవహాయనశకపువత్సరమందుం
బదునొకండవ నెలలో నిరు, వదియవదినమున ముగింపఁబడెనిది రామా. 27

నవగ్రహస్తవము సమాప్తము.



## సవరణ.

రాహుస్తవములో 11 వ పద్యమైన మత్తేభము 3, 4 పాదములీక్రింది రీతిని చేర్చి చదువుకొనవలెను.

"స్థితిఁదత్తద్గ్రహరాసులందిరిగితచ్ఛీలానుగుణ్యంబుగా
క్షితిసృష్టిన్నడిపించు నీ జడమతుల్ కీర్తింతురే? రాహువా.

## శుద్ధాశుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. | పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 4 | 19 | కమకక | కనుకఁగ | 24 | 6 | కెల్ల | లెల్ల |
| 5 | 2 | శామాత్ర | శ్యామాత్ర | ,, | 17 | మూర్ఖుఁడా | మూర్ఖుఁడా |
| ,, | 19 | బులభూ | బులెభూ | 37 | 8 | దశాపవ | దశాపన |
| 14 | 18 | కవిన్వ | కలివ్వ | 38 | 16 | మద్భవ | ముదుద్భవ |